శ్రీ రస్తు.

ఆది శ్రీ లక్ష్మీనారాయణ చరణారవింద

—ందపానానందేందిందిరాయమాన మానసుండగు

సందడి నాగయాభిధాన భక్తాగ్రేసరునిచేత రచియింపబడిన

# శ్రీ లక్ష్మీనారాయణ శతకము




సంపాదకులు :

సందడి శ్రీరామదాసుగారు

దబ్బాకుపల్లి

కృష్ణా జిల్లా



గ్రంథకర్త:

సందడి నాగదాసు.

శ్రీరస్తు.

ఇది

శ్రీలక్ష్మీనారాయణ చరణారవింద

మరందపానానందేందిందిరాయమాన మానసుండగు

సందడి నాగయాభిధాన

భక్తాగ్రేసరునిచేత

రచియింపంబడిన

# శ్రీ లక్ష్మీనారాయణ శతకము



సంపాదకులు:

సందడి శ్రీరామదాసుగారు

దబ్బాకుపల్లి

కృష్ణాజిల్లా



బెజవాడ

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1938.

శ్రీరస్తు.

శ్రీలక్ష్మీనారాయణాయ నమః.

అస్మద్గురుభ్యో నమః.

# విన్నపము



పాఠకమహాశయులారా!

అస్మజ్జనకులును కీ॥ శే॥ నగు శ్రీ శ్రీ శ్రీ సందడి నాగదాస దేశికులవారీ శతకమును బాల్యమందే సీసపద్యములుగా నియమలక్షణములతో రచియించి (1886 సం॥) అచ్చొత్తించి ప్రచురించి ప్రసిద్ధిజెందిరి. ఏతద్గ్రంధరచయిత ప్రప్రథమ మనుకొన నిప్పటికీ శతకముద్రణమై చాలకాలమౌటచే ప్రస్తుతాభిలాషకులకు లభించకుండుటంగాంచి ద్వితీయ ముద్రణమొనర్ప ఎట్టకేల కొక శిథిలగ్రంధమును సంపాదించి జూడ (8) పద్యములు పూర్తిగా శిథిలమౌటచే వారి నెఱిగిన మిత్రులను శిష్యులను శతకపాఠకులను విచారించితిని. కాని వారికిని యీ శిథిలపద్యములే జ్ఞప్తి లేనందువలన శిథిలపద్యములు శక్తికొలది పూర్తిచేయనెంచి శతక నామమునకు భిన్నము లేకుండుటచేతను అవకాశమివ్వక ముద్రణకై లక్ష్మాంబ త్వరపడుటవలనను గుర్వాజ్ఞ యింతే యనుకొని విరమించితిని. శతకాభిలాషుల కోర్కె దీర్ప పలుశ్రమలకోర్చి ద్వితీయ ముద్రణకై తోడ్పడిన శ్రీమతి వినగంటి లక్ష్మాంబగారికిని చదువరులకును మిగుల కృతజ్ఞుడను.

ఇట్లు,

బుధజనవిధేయుడు;

సంపాదకుడు.



అస్మద్గురుభ్యో నమః.

# శ్రీ లక్ష్మీనారాయణ శతకము

## సీసపద్యములు.

### అంత్యప్రాసాష్టకము

సీ॥ శ్రీకరదివ్య ల♦క్ష్మీవక్ష మురశిక్ష
దానవగర్వ వి♦దారదక్ష
మౌనిరాడ్హృదయ దు♦ర్మలమోక్ష నిటలాక్ష
గణన సద్గుణ సుధీ ♦ కల్పవృక్ష
యధిక కిల్బిష గజ♦హర్యక్ష నిరపేక్ష
సాత్త్వికభక్తపో♦షణ సుధీక్ష
యమరవందిత త్రిభువ ♦ నాధ్యక్ష కనకాక్ష
మర్దన సద్ధర్మ ♦ మనుజపక్ష
నుతఖచరయక్ష బాలిశ♦తతిపరోక్ష
యోగిహృత్ప్రేక్ష విదళిత ♦ యుగ్రకక్ష
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాణాబ్జాక్ష ♦ లలితవక్ష.

సీ॥ నీరదశ్యామ వ♦ర్ణిత సద్గుణస్తోమ
దళిత దుష్కామ శ్రీ♦తులసిధామ
వినుత సూత్రామ గ♦ర్విత దైత్యగణభీమ
సజ్జనాంబుధిసోమ ♦ సత్యకామ
దనుజవిరామ వ♦ర్ధనమాని హృత్సీమ
నరగుణగ్రామ దై♦వాలలామ
పరిపూర్ణ భూవ్యోమ ♦ భవ్య పరంధామ
జితవైరి సంగ్రామ ♦ క్షేమభూమ
యమర మునినుతనామ లో♦కాభిరామ
కుజనతమ చండధామ వై♦కుంఠధామ
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 2

సీ॥ అఖలదేవర్షి బ్ర♦హ్మాది సన్మోదపాత్ర
నీలజీమూత స♦న్నిభసుగాత్ర
నరసఖయక్ష కి♦న్నర మోదచారిత్ర
పాతకజనవన ♦ వీతిహోత్ర
నవపుండరీక ప♦ద్మస్థిత శుభనేత్ర
యసుర సంఘాతల♦తాలవిత్ర
యిందిరావదనార ♦ విందవారిజమిత్ర
ఘనధైర్య సంపద ♦ కనకగోత్ర
మధుసురద్విప జైత్ర ♦ మాకళత్ర
యోగి హృదయాబ్జమిత్ర జి♦తోగ్రవృత్ర
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 3

సీ॥ భక్తిసంయుత మహా ♦ పండితమందార
పరమ కిల్బిషవారి ♦ ధరసమీర
నిఖిలజీవాకార ♦ నీరధి గంభీర
భక్తపోష విచార ♦ భవవిదూర
కరిరాజ వరద సా♦గరకన్య హృచ్చోర
కరుణాపయోధి సం♦గ్రామధీర
రత్నజాంబూనద ♦ రాజిత కేయూర
యసమాక్ష హృదయ సా♦రసవిహార
కైటభాసుర సంహార ♦ కదనశూర
కోమల శరీర జితశత ♦ కోటిమార
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 4

సీ॥ క్షీరసాగరకన్య ♦ చిత్తసారసభృంగ
జీవనభవభవా ♦ ర్చితశుభాంగ
నిర్జితశాత్రవ ♦ నికరసంగరరంగ
మదయుత దనుజత♦మఃపతంగ
పాలితమునిహేమ ♦ చేలతార్క్ష్యతురంగ
దేవశాత్రవమదో ♦ ద్రేకభంగ
వందిత కవిజన ♦ బృందదయాపాంగ
యఖిల విష్టపనికా ♦ యాంతరంగ
భక్తజనసంగ పదగంగ♦పాపభంగ
యువన మాతంగదుర్వ్య స♦నాభిషంగ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 5

సీ॥ వేదాంతవేద్య బ్ర♦హ్మాదిసుమనసపూజ్య
భవరోగవైద్య స♦ద్బ్రహ్మవిద్య
పరమాత్మగోవింద ♦ భక్తహృదానంద
పరిభవరిపుబృంద ♦ హరి ముకుంద
ఆయతకీర్తిసం ♦ యమిహృదాంతర్వర్తి
చిన్మూర్తి దేవతా ♦ చక్రవర్తి
క్షీరవారధి గేహ ♦ నీరదనిభ దేహ
వినుతభక్తసమూహ ♦ విజితమోహ
నయనశశిపూషనవసువ♦ర్ణమణిభూష
సాధుజనపోష మంజుల ♦ సత్యభాష
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 6

సీ॥ అప్రమేయానంత ♦ యచ్యుతశ్రీకాంత
మునిహృన్నిశాంతయ ♦ మోఘశాంత
నిర్జితాశాపాశ ♦ నిఖిలలోకాధీశ
సకలపాపవినాశ ♦ స్వప్రకాశ
యతిదీనత్రాతఖం♦డితవైరి సంఘాత
దానసంప్రీత ప♦ద్మాసమేత
కల్మషనిర్ధూత ♦ కరుణారసోపేత
పోషితాఖిలభూత ♦ భువననేత
శీలగుణజనపాల ద♦యాలవాల
భద్రగుణజాల సురుచిర ♦ భర్మచేల
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 7

సీ॥ గానవినోదసం ♦ గరజితరిపుమద
మహితలోకవిలాస ♦ మందహాస
పరతత్త్వరూపతా ♦ పసహృదాంతర్దీప
నిఖిలలోకాధార♦నిర్వికార
స్వర్ణకుండలకర్ణ ♦ సకలజగత్పూర్ణ
వరదయాసాంద్ర శ్రీ♦ధరయుపేంద్ర
శౌరివిష్వక్సేన ♦ జననమరణ విహీన
హరివాసుదేవమ♦హానుభావ
యతులరత్నకిరీట భం♦జితనిశాట
వందితవిధాత కవిజన ♦ పారిజాత
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 8

అంత్య ద్విప్రాస సీసము

సీ॥ పల్లవారుణ చరణ ♦ భక్తమూర్ధాభరణ
నిరుపమహర్ష శ్రీ♦పరమపురుష
దానవదండన ♦ దైవతమండన
పన్నగాధిపశయన ♦ పద్మనయన
కుందకుట్మలరదన ♦ యిందుసన్నిభవదన
క్షీరాబ్ధిభవన ర♦క్షితత్రిభువన
కీర్తిశారద శరద ♦ యార్తవారణవరద
భవనిధితరణ ని♦ర్మలత్రికరణ
పరమశుభకర పోషిత ♦ భక్తనికర
కనకమణివలయ సనకహృ ♦ ద్వనజనిలయ
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 9

## నామస్తోత్రత్రయము

సీ॥ వామనాధోక్షజ ♦ వైకుంఠ మాధవ
కేశవాచ్యుత హృషీ ♦ కేశ శౌరి
సర్వేశ్వర సురేశ ♦ సర్వాదిసర్వాత్మ
సర్వదర్శన సత్య ♦ సర్వయోగ
బ్రహ్మణ్య బ్రహ్మకృ ♦ ద్బ్రహ్మత్రిలోకాత్మ
బ్రాహ్మణప్రియ బ్రహ్మ ♦ బ్రహ్మ శార్ఙ్గి
యజ్ఞవాహన యజ్ఞ ♦ యజ్ఞాంగ యజ్ఞభృ
ద్యజ్ఞకృ ద్యజ్ఞేశ ♦ యజ్ఞభోక్త
విశ్వమూర్తి మహామూర్తి ♦ వినుతకీర్తి
దీప్తమూర్తిరమూర్తిమాన్ ♦ దివ్యమూర్తి
నతజన సురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 10

సీ॥ శ్రీధర శ్రీకర ♦ శ్రేయశ్రీనిధి శ్రీద
శ్రీవిభావన శ్రీశ ♦ శ్రీనివాస
గోహిత గోపతి ♦ గోప్తానివృత్తాత్మ
కామదేవః కామి ♦ కామపాల
వేదవిదవ్యంగ ♦ వేదాంగ వేదవి
త్కవికామకృత్కాంత ♦ కామకరుణ
దుర్జయదుర్లభ ♦ దుర్గదురావాస
దురతిక్రమ శుభాంగ ♦ దురితదూర
స్వస్తిదస్స్వస్తిస్వస్తికృ ♦ త్స్వస్తిభోక్త
యవ్యయాతీంద్రియపరాత్మ ♦ యఘవినాశ
నతజన సురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 11

సీ॥ భూతకృద్భూతభృ • ద్భూతాత్మ పూతాత్మ
భూతభావనభావ • పురుషవర్య
సర్వగ సర్వవి • త్సర్వజగత్సాక్షి
సర్వసదాయోగ • సర్వరక్ష
సుముఖసూక్ష్మసుఘోష • సుఖదసువ్రతసుహృ
త్సుప్రసాదసుపర్ణ • సుభుజసులభ
ప్రాణజీవనవన • ప్రాణధృత్ప్రాణద
ప్రణవప్రాణప్రమాణ • ప్రాణనిలయ
విశ్వదక్షిణవిస్తార • వీరబాహు
సుగతిసత్కృతివిధృతి • సుకృతవినుత
నతజనసురక్షఘనకరు • ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 12

ఆద్యంతప్రాసైకసీసము

సీ॥ కందర్పజనక స • నందనముఖముని
వందితసచ్చిదా • నందమూర్తి
యిందిరా హృదయార • విందయిందిందిర
మందరధర ముచు • కుందవరద
కుందకుట్మలదంత • యిందుసన్నిభవదన
సుందరాకారగస • న్మందహాస
దందశూకాహిత • స్యందన సద్భక్త
బృందవంద్యపదార • విందయుగళ
వందితాఖిలసుజన సం • క్రందనాది
వందనీయ ముకుంద గో • విందశౌరి
నతజన సురక్ష ఘన కరు • ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 13

పునఃపునరుక్తినామస్తోత్రత్రయము

సీ॥ పరిపూర్ణపరమేశ ♦ పరమపరంధామ
పరమాత్మమాధవ ♦ పరమపురుష
విశ్వాత్మవిశ్వేశ ♦ విశ్వరూపముకుంద
విశ్వవందితసర్వ ♦ విశ్వరక్ష
నిష్కారణ నిరీహ ♦ నిర్గుణనిర్ద్వంద్వ
నిష్కళంక నిరాశ ♦ నిర్వికార
సర్వేశ సర్వాత్మ ♦ సర్వలోకాతీత
సర్వభూతనివాస ♦ సర్వసాక్షి
నిరవయవ నిరుపమానంద ♦ నిగమవేద్య
యాదిమధ్యాంతశూన్యన ♦ ర్వాంతరాత్మ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 14

సీ॥ పద్మాక్షయోగి హృ♦త్పద్మాళి పద్మేశ
పద్మసంభవజనక ♦ పద్మనాభ
భవహర విభవ ♦ భవనుత భవపోష
భవనాశహీన వా♦ర్యతసుచరణ
వనధిగంభీరపా ♦ వనపాదవనదైత్య
వనధనంజయక్షీర ♦ వనధిశయన
హరిహరినేత్ర శ్రీ♦హరిహరి నుతపాత్ర
హరిశౌర్యదుర్జన ♦ హరిమురారి
ధరధరాఖిలవైరి కం♦ధరసమీర
ధర పరమధైర్యయిందిరా ♦ ధరయుపేంద్ర
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 15

సీ॥ అనిరుద్ధ సంకర్ష • ణాచ్యుత గోవింద
కేశవ హరి హృషీ • కేశకృష్ణ
మాధవ వామన • మధుహర నరసింహ
ప్రద్యుమ్న శ్రీధర • పద్మనాభ
దామోదరయుపేంద్ర•దైత్యార్యధోక్షజ
శ్రీవత్సలాంఛన • దేవదేవ
వాసుదేవ ముకుంద • వైనతేయధ్వజ
విశ్వంభరమునీంద్ర • వినుతశౌరి
శాశ్వతబ్రహ్మమైన నీ • చరణములకు
వందనము వందనము చిదా•నందమూర్తి
నతజనసురక్ష ఘన కరు•ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 16

అవతారదశకము

సీ॥ చతురాననుడు నిద్ర•చేతనుండగ క్షుద్ర
మనుజాశనుడువచ్చి • ముదము హెచ్చి
శ్రుతులెత్తుకొనిపోగ • శుభమాయెనని వేగ
మీనరూపముదాల్చి • వానదల్చి
ఘోరయుద్ధముచేసి • కుంభినిపై ద్రోసి
ప్రాణముల్ బాపి నీ•ప్రజ్ఞజూపి
సోమకుడనిగూల • సుఖమాయెనని చాల
సురవరుల్వేడ కి•న్నరులువాడ
వేదములు మరలదెచ్చి యా•వేధకిచ్చి
నట్టి నినువేడెదను దేవ • యమలభావ
నతజనసురక్ష ఘన కరు•ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 17

సీ॥ అసురులకునునోడి ♦ యమరావతినివీడి
దేవతల్నినువేడ ♦ దెగువతోడ
క్షీరాబ్ధిమథియింప ♦ దారిదెల్పనిలింప
గణము దైత్యులడాసి ♦ ఘనముజేసి
మందరాద్రినిదెచ్చి మథియింపగాజొచ్చి
నప్పుడబ్ధియుబొంగ ♦ నగముగ్రుంగ
కూర్మరూపముదాల్చి ♦ కొండవీపునదేల్చి
సురలరక్షించి దై♦త్యులవధించి
నట్టి నినుగొల్చెదనుజేరి ♦ యఘవిదారి
యప్రమేయహృషీకేశ ♦ స్వప్రకాశ
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 18

సీ॥ హేమాక్షుడవలీల ♦ భూమియంతయుగేల
జాపరీతిగజుట్టి ♦ చంకబెట్టి
యెదురైన పగవారి ♦ మదమడంగగబోటి
యబ్ధిలోపలికేగ ♦ నదియువేగ
వినిపోత్రివైవాని ♦ దనుముట్టకైపూని
వారిధికడజేరి ♦ వానిజేతి
యధికయుద్ధముచేసి ♦ యట్టుచట్టునగోసి
మరణంబునొందించి ♦ మహిమగాంచి
ధాత్రి మునుపటివలెనుంచి ♦ దయనుబెంచి
నట్టి నినుగొల్తు ననుబ్రోవు♦మయ్యనీవు
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 19

సీ॥ హేమాక్షుమృతివిని ♦ హేమ కశిపుడు మించి
సురలసాధులభూమి ♦ సురల వంచి
బాలుడౌ ప్రహ్లాదు ♦ బాధపెట్టగ నోడి
కోపించి నీపోష♦కుండు నేడి
యీ స్తంభమున విష్ణు ♦ నిటుచూపుమని వ్రేయ
దశదిశలను బ్రీతి ♦ ధ్వనులుసేయ
స్తంభమందున నృకే ♦ సరివియై జనియించి
దానవాధిపుపొట్ట ♦ దఱిమిచించి
ప్రేవులనుదీసి ప్రహ్లాదు ♦ ప్రియముచేసి
శాంతినొందిన పద్మేశ ♦ జగదధీశ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 20

సీ॥ అసురుల నడగింప ♦ నదితికిజనియించి
మురిసి వామన నామ♦మును వహించి
గోచిజన్నిదమును ♦ గొడుగును ధరియించి
పటువేగమునబోయి ♦ బలిని గాంచి
స్వస్త్యస్తు దీర్ఘాయు ♦ రస్తని దీవించి
పాదత్రియము భూమి ♦ బహుగనెంచి
యడిగిన నతడిచ్చు ♦ నపుడు విజృంభించి
పాతాళమునద్రొక్కి ♦ బలినినుంచి
వాసవునిగాంచి రాజ్యంబు ♦ నొప్పగించి
నట్టి సద్భక్తపాల ద♦యాలవాల
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 21

సీ॥ జమదగ్ని సుతుడవై ♦ జనియించి భువిలోన
పరశురాముడ వాగ ♦ మెరసహీన
విక్రమంబున కార్త ♦ వీర్యార్జునునిద్రుంచి
యతనిపుత్రుల నెల్ల ♦ ననివధించి
జగతిమీదను రాజ ♦ శబ్దంబులేకుండ
నిరువదియొకమారు ♦ సరసిఖండ
నమున ఖండించి మో ♦ దమున కశ్యపుజేరి
ధరణియంతయు నిచ్చి ♦ తపముగోరి
వనమునకు నేగి నిష్ఠచే ♦ మనమునాగి
సన్మునులు వేడనుంటివి ♦ శమముతోడ
నతజనసురక్ష ఘన కరు ♦ ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 22

సీ॥ దశరథ సుతుడవై ♦ ధరలోన నుదయించి
శ్రీరాముడను పేర ♦ జెలువుగాంచి
సవనరక్షణజేసి ♦ శివునిచాపముద్రుంచి
సీతను వరియించి ♦ చెలువుగాంచి
జనకుని యాజ్ఞచే ♦ వనమునకేతెంచి
ఖరదూషణాదుల ♦ గడిమిద్రుంచి
వాలిని బరిమార్చి ♦ వారిధిబంధించి
నరగరావణుబట్టి ♦ సంహరించి
సీతతో గూడి పట్టాభి ♦ షేకమొంది
రాజ్యమేలిన రామ సం ♦ గ్రామభీమ
నతజనసురక్ష ఘన కరు ♦ ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 23

సీ॥ కృష్ణాగ్రజుండవై ♦ వృష్ణికులమున బుట్టి
బలరాముడనగలాం♦గలముబట్టి
కృష్ణునితోఁగూడి ♦ కుటిలుర బరిమార్చి
రయమున భూమి భా♦రంబు దీర్చి
రణరంగమున ప్రలం♦బుని ప్రాణములదీసి
లలితగోగణము పా♦లనము చేసి
తీర్ధ యాత్రకు నేగి ♦ దివ్యస్థానులజూచి
ఘనమైన నదుల మ♦జ్జనము చేసి
నట్టి నినుగొల్తు దివ్యాంగ ♦ యసురభంగ
నిర్మలాకార సుజన దు♦ర్మలవిదూర
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 24

సీ॥ ఆమ్నాయవిహితస ♦ దాచారులైలోక
ములలోన నెవరికి ♦ నలవిగాక
యున్నట్టిత్రిపురులై ♦ త్ర్యంబకుడకునువేగ
బుద్ధుడవైచని ♦ మృదులవాగ
నిపుణతతోధర్మ ♦ చపలులగాజేసి
వారికాంతలయుక్తి ♦ వలనడాసి
భ్రష్టపాతివ్రత్యనిష్ఠల ♦ గావించి
త్రిపురదానవులనే ♦ రుపునవంచి
శివునిచేతనుజంపించి ♦ సిరివహించి
నట్టినిను నుతియింతునే ♦ త్ర్యారిశౌరి
నతజన సురక్షఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 25

సీ॥ కలియుగాంతమున లో♦కులు దరిద్రమువల్ల
గుమతులై ఘోరక♦ర్మములనెల్ల
నల్పి వర్ణాశ్రమా♦చారాదులనుదప్పి
వర్తింపగలరు కా♦వరముగప్పి
యపుడు కల్క్యవతార ♦ మద్భుతంబుగనెత్తి
క్రూరాత్మకులనెల్ల ♦ గూలమొత్తి
సాధులరక్షించి ♦ సర్వవర్ణములరిసి
కృతయుగధర్మంబు ♦ కుదురుపరచి
బ్రోవగలవని సజ్జనుల్ ♦ బొగడుచుందు
రఖిలకల్మషదూర ద♦శావతార
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 26

ప్రార్థనాష్టాదశము

సీ॥ విశ్వప్రబోధ గ♦ర్వితదైత్యసంహార
వేదాంగవేదవి ♦ ద్వేదజిహ్వా
నీమహత్వంబెన్న ♦ నేర రదెంత సు
మతులైన భవపితా ♦ మహులునైన
నేనెంతవాడను ♦ నిన్నుసన్నుతి సేయ
జడుడదీనుడ పామ♦రుడను ఖలుడ
జన్మపావనముకై ♦ స్మరణచేసితిగాని
మందిమెచ్చనుగాదు ♦ మదనజనక
గానసీదయ నామీద ♦ గలుగజేయు
మవ్యయానంద మాధవ ♦ హరిముకుంద
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 27

సీ॥ సర్వతోముఖ సహ♦స్రాక్ష పూజిత పాద
సర్వలోకాధార ♦ శాంతరూప
నీవె దైవములలో ♦ భావింప ఘనుడవు
నీ నామమే పాప♦నికరహరము
నీపాదములె భవ♦నీరధికిని నావ
నీ కృపాదృష్టి పె♦న్నిధిచయంబు
నీ కథామృతమె త్రి♦లోక పవిత్రంబు
నీవె సర్వము సత్య♦మింతయనుచు
నిన్నునమ్మితి నరలేక ♦ నిశ్చయముగ
నన్ను రక్షింపుమయ్య మా♦నక పరాత్మ
నతజన సురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 28

సీ॥ పరుల వేడనటంచు ♦ బాసచేసినగాని
నమ్మజాలవదేమి ♦ నెమ్మనమున
వేడినప్పటికిని నీ♦ వేకావె సర్వంబు
పరులెవ్వరున్నారు ♦ ధరను దివిని
గానన్నుపై నీదు ♦ కరుణారసము జిల్కి
చిత్తచాంచల్య మ♦శేషముగను
బాపి నిరతము నీదు ♦ భజనయందాసక్తి
గలుగజేసియు నేలు ♦ కష్టమనక
దీనుడను బుద్ధిహీనుడ ♦ ధ్యానగమ్య
నీరధిగభీర సువిచార ♦ నిర్వికార
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 29

సీ. తల్లిదండ్రియు గురువు ♦ దైవంబు దాతయు
భ్రాతులు మిత్రులు ♦ బంధుజనులు
ధనము విద్యయు సర్వ ♦ ధర్మంబులాదిగా
నీవెనా పాలికి ♦ నిశ్చయముగ
నన్యంబులేదని ♦ యాశ్రయించితినిన్ను
గరుణార్ద్రచిత్తంబు ♦ గలిగినన్ను
నీస్వరూపము గదిసి ♦ నిశ్చలమనమున
ధ్యానించి తన్మయ♦త్వమును జెంది
యితరమెరుగక నుండున♦ట్టి వరంబు
నిచ్చిప్రోవుమీ శుభగాత్ర ♦ సచ్చరిత్ర
నతజన సురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 30

సీ. నాధనంబును విద్య ♦ నాక్షేత్రపాత్రముల్
నాపశుభృత్యులు ♦ నాగృహంబు
నాశరీరంబును ♦ నామనోవాక్కాయ
ముల జేయుకార్యము ♦ లుమ్ముఖ్యముగను
నాదగుసర్వంబు ♦ నారదనుతనీకు
నే బాగుగా సమ♦ర్పణముచేసి
భగవదాజ్ఞయటంచు ♦ బనులెల్లజేయుచు
నిన్నె నమ్మితి దేవ ♦ నిజముగాను
గాన నన్నేలుటకు భార♦కర్త వీవె
యనవరత భూరిహర్ష స ♦ హస్రశీర్ష
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 31

సీ॥ నీనామస్మరణ పె♦న్నిధిగల్గ నెకదా
నారదముని ముని ♦ నాథుడౌట
నీనామస్మరణ చ♦న్నిళ్లచేతనెకదా
ప్రహ్లాదు పాపాగ్ని ♦ బడకమనుట
నీనామస్మరణ తర♦ణియు దొరకగనెకదా
శుకుడు సంసారాబ్ధి ♦ దొరకచనుట
నీనామసంస్మరణ ♦ నిశ్శ్రేణిచేగదా
సకల మౌనులును తా♦రకముగనుట
యట్టి నీనామస్తుతి నా హృద♦యాబ్జమునను
నిరతమును బాయకుండగ ♦ నిల్పిప్రోవు
, నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 32

సీ॥ పరుల నెల్లప్పుడు ♦ బహుగ దూషించుటే
కాని సద్భక్తుల ♦ గణన లేదు
పరవధూమణుల పై ♦ భ్రాంతి నొందుటె కాని
పరమ ప్రసన్నుల ♦ భజన లేదు
పరధనంబుల కాస♦బడి యుండుటే కాని
యరయ భక్తార్చ్య నిం♦తైన లేదు
పరుల హింసింప సం♦బర పడుటే కాని
జగదుపకారంబు ♦ సలుప లేదు
గాన నేజేయు దోషముల్ ♦ కడకు ద్రోసి
పూర్ణకృపతోడ రక్షింపు ♦ బుద్ధిబెంపు
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 33

సీ॥ పాపాత్ములలో దొడ్డ ♦ పాపాత్ముడను నేను
కరుణాకరులలోన ♦ ఘనుడవీవు
దీనులలో పరము ♦ దీనుండనుమి నేను
ధనికులలో బూర్ణ ♦ ధనుడవీవు
అబలులలో భూరి ♦ యబలుండనుమి నేను
బలవంతులలో మహా ♦ బలుడవీవు
అఖిలవిషయములనూ ♦ నాధికారిని నేను
నిఖిలంబునకు మహా ♦ నిధివినీవు
గాన ననుబ్రోచుటకు నీవె ♦ కాక యితరు
లెవ్వరున్నారు భవనాశ ♦ యిందిరేశ
నతజనసురక్ష ఘన కరు ♦ ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 34

సీ॥ నీ దాసవరుల స ♦ న్నిధిగల్గినటులైన
వైకుంఠమున కేగు ♦ వాంఛయేల
నీ దాసవరుల వ ♦ ర్ణింప గల్గినజాలు
నితర దేవతల స ♦ న్నుతులవేల
నీ దాసులను పూజ ♦ నిత్యజేసినజాలు
విగ్రహార్చనమీద ♦ వేడ్కలేల
నీ దాసవరుల ప్రి ♦ మోదింప జేసిన
చాలు యజ్ఞము జేయు ♦ శీలమేల
యట్టి నీ దాససాంగత్య ♦ మనవరతము
కలుగ వరము ప్రసాదింప ♦ వలయు దేవ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 35

సీ॥ నారాయణాయను ♦ నాలుగక్షరములే
కిల్బిషమత్తేభ ♦ కేసరియును
నారాయణాయను ♦ నాలుగక్షరములే
యతిదరిద్రాద్రి వ♦జ్రాయుధంబు
నారాయణాయను ♦ నాలుగక్షరములే
పరమ రుజ్మండూక ♦ పన్నగంబు
నారాయణాయను ♦ నాలుగక్షరములే
యజ్ఞానతిమిర మా♦ర్తాండదీప్తి
యిట్టి నీ యాహ్వయమహాత్మ్య ♦ మెరుగలేక
పరుల వేడిన నరకంబు ♦ పాలుగారె
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 36

సీ॥ తపములు జపములు ♦ దానంబు ధ్యానంబు
వ్రతములు క్రతువుప♦వాసములును
యమనియమాసన ♦ క్రమము ప్రాణాయామ
ధారణ మొదలైన ♦ ధర్మములును
నొకటైన సేయజా♦లక నా యథాశక్తి
కొలది సన్నుతిసేయ♦గోరి నీకు
మ్రొక్కితి నన్నేలు ♦ మోసపుచ్చక శర
ణన్న బ్రోచె బిరు♦దున్నదనుచు
దెలిసితిని యింక వెరపేల ♦ దేవ దేవ
శంఖపాణి పరంధామ ♦ సార్వభౌమ
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 37

సీ॥ అడవిలోపల నిరాహారులై యున్నట్టి
తపసులనేలుట దయయుగాదు
హఠమున బ్రాణంబు లాగబట్టిన యోగి
వరుల బ్రోచుట ఘన తరముగాదు
దశవిధేంద్రియముల వశము జేసుకయున్న
మునులరక్షించుట బ్బురముగాదు
[illegible]రికర్మఫలంబు వారలకొసగుట
పరికింపగా మహాప్రజ్ఞ గాదు
గానమూఢులగాచుటే ఘనమునీకు
ప్రణుత నిఖిలార్య యోగిహృత్పద్మసూర్య
నతజనసురక్ష ఘన కరుణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష లలితవక్ష. 38

సీ॥ నీభక్తులనుజూచి నింద సేయకయున్న
జాలు సద్వ్రతములు సలిపినట్లు
నీభక్తులనుజూచి నిక్కకున్న నుంగాలు
వాసిగా దానముల్ చేసినట్లు
నీభక్తులనుజూచి నేరమెన్నకయున్న
జాలుమఖములుచేసి నోలినట్లు
నీభక్తులనుజూచి నిష్కారణంబుగా
తిట్టకున్నను గుడికట్టినట్లు
గాననీదాసవరుల చెంగటవసించు
దాసులకుదాసుడను నేను దయనుజూడు
నతజన సురక్ష ఘన కరుణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష లలితవక్ష. 39

సీ॥ ఇతరచింతలబాపి ♦ సతతంబు నీనామ
స్మరణగల్గఁగఁజేయు ♦ పరమపురుష
యితరచింతలబాపి ♦ సతతంబునీమూర్తి
ధ్యానింపజేయుము ♦ దానవారి
యితరచింతలబాపి ♦ సతతంబు నీపాద
పూజసేయింపుమి ♦ రాజవదన
యితరచింతలబాపి ♦ సతతంబు నీకథా
శ్రవణంబుగలిగింపు ♦ భువనరక్ష
యితరచింతలలవమైన ♦ సతతయాత్మ
నంటకుండఁగ జేసిన ♦ న్నాదరించు
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష. ♦ లలితవక్ష. 40

సీ॥ నిను నుతించెడి నోట ♦ నీచమానవులను
వినుతి సేయఁగలేను ♦ గనకవసన
నీ మృదుపద నవ ♦ నీరజార్చనచేయు
హస్తాన ఖలుల భి♦క్షడుగలేను
నీస్వరూపము నుధ్యా♦నించుచిత్తంబున
నితరకార్యముల చిం♦తింపలేను
నీవశంబైనట్టి ♦ నావపుకొంఅకున్నై
శ్రమపడజాలనో ♦ కమలనాభ
యెన్నివిధములనైనను ♦ నిన్నెకాని
యితరులను వేడజాలనే ♦ పతగగమన
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 41

సీ॥ పూర్వజన్మముననే ♦ పుణ్యంబుచేసితొ
నీపద్మభావముదెలియ ♦ నేర్పుగలిగె
మున్నయే తపముచే ♦ నున్నవాడనొకాని
నీనామభజన పెం♦న్నిధియు దొరకె
వెనుకనే దేవుని ♦ వినుతిజేసితినొకో
నీకథల్వినునట్టి ♦ నిష్ఠగలిగె
నాదిసియేవ్రతం♦బాచరించితినొకో
నీభక్తవరుల స♦న్నిధియుగలిగె
గాన సంశయములనెల్ల ♦ కడగుదొలిగె
నింకమాకేమికొదువ మ♦హేశయీశ
నతజన సురక్షకుసకరు ♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 42

సీ॥ నీపాదనౌకచే ♦ నిరుపమసంసార
వనధిదాటుటయెంత ♦ సనిమహాత్మ
నీనామనుతిసుధా ♦ పానంబుచేదుఃఖ
మృత్యువుగెల్పు ట♦బ్బురము దేవ
నీస్వరూపధ్యాన ♦ నెమ్మిచే వృజినస
ర్పములగెల్పుటయెంత ♦ వనధిశయన
నీసపర్యాగ్నిచే ♦ తాపసపయోనిధి
నింకజేయుటకేమి ♦ శంకసామి
గావునను నీదుసేవయు ♦ గల్గెమాకు
నిక భయములేదు సన్నుత ♦ శుకమునీంద్ర
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 43

నామపరిభావద్వయము.

సీ॥ నారాయణాయని ♦ నాలుకొక్కొకమాటు
గదలింపదోషము ♦ ల్కడకుదొలగు
నారాయణాయని ♦ నవ్వుచునైనను
బలుకదారిద్ర్యము ♦ ల్భసితమౌను
నారాయణాయని ♦ నతిజేసినట్లయిన
భవభయంబులునెల్ల ♦ బాజిపోవు
నారాయణాయని ♦ పారాయణముజేయ
ఘోరదుఃఖంబులు ♦ కొట్టువడును
గాన నీదుపరిభావంబు ♦ గణనసేయ
శేషగీష్పతులకునైన ♦ శక్యమగున
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 44

సీ॥ నారాయణాయని ♦ పారాయణముసేయు
నరులకు మోక్షంబు ♦ కరగతంబు
నారాయణాయని ♦ నమ్మిభజించెడి
వారిసాటెవ్వరీ ♦ వసుధలోన
నారాయణాయని ♦ సారెసారెకుబిల్వ
వారిజన్మమెజన్మ ♦ తేరిచూడ
నారాయణాయనువారి ♦ పాదరజంబు
సోకిననరులకు ♦ శుభముకలుగు
గాన నాజిహ్వనీయభి ♦ ధానమెప్డు
మరువకుండెడిసుస్థిర ♦ వరమొసంగు
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 45

దృష్టాంతైకవింశతి.

సీ॥ తల్లిదండ్రులుపుత్రు ♦ దండింపదలచిన
బరులు వలదనియడ్డు ♦ పడగగలరె
యుగ్రుడై భూపతి ♦ నిగ్రహించినయెడ
మంత్రిపురోహితు ♦ లాన్నగలరె
మృత్యుదేవత ప్రాణ ♦ ములుదీయదలచిన
ఘనవైద్యులెల్లను ♦ మనుపగలరె
యంబుధులుప్పొంగి ♦ యవనిపైగ్రమ్మిన
మానవుల్ రాకుండ ♦ మలుపగలరె
నీవు శిక్షింపదలచిన ♦ నిఖిలమైన
దేవతలువచ్చి క్షణమైన ♦ బ్రోవగలరె
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 46

సీ॥ మంటి గణపతిని ప♦ల్మారు పూజించుగా
ణాపత్యులకు దరి♦ద్రంబు గలిగె
వీరుల గొల్చెటి ♦ పేద తురకలకును
ధనసమృద్ధియు గల్గె ♦ ధరణిలోన
శాంభవినెప్పుడు ♦ స్మరియించు శాక్తికుల్
భోగభాగ్యంబుల ♦ పూర్ణులెరి
రాతిలింగంబును ♦ చేతిలో పూజించు
శైవులు శాశ్వతై♦శ్వర్యులైరి
యెన్నివిధముల జూచిన ♦ నిన్ను గొల్చు
భక్తులేకద దారిద్ర్య♦యుక్తులౌట
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 47

సీ॥ నీభార్య శ్రీలక్ష్మి ♦ నిర్ధనికుల కటా
క్షమున జూచినగల్గు ♦ నమితధనము
నీ సుతుండగు బ్రహ్మ ♦ నిఖిలమానవులకు
వ్రాసినంతనెగల్గు ♦ శ్రీసమృద్ధి
నీ మామసాగరుం ♦ డీమహి మనుజులు
తలచిన రత్నము♦ల్గలుగ జేయు
నీవై తే భువనముల్ ♦ నిష్కారణంబుగ
గలుగజేసిన సర్వ♦ కారణుడవు
యేమిపాపము నీ భక్తు♦లెన్న దీను
లగుట చిత్రము సర్వభూ♦తాంతరాత్మ
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 48

సీ॥ ధనమున గర్వంబు ♦ దాన సజ్జననింద
దానజేసి మహాప♦దలును గలుగు
ధనమున కోపంబు ♦ దాన దుష్కర్మంబు
దానిచే నరకయా♦తనలు కలుగు
ధనమున లోభంబు ♦ దాన రాగాదులు
దానిచే బహుజన్మ♦తతులు గలుగు
ధనమున మదమును ♦ దానిచేత నహింస
దానిచే దుఃఖముల్ ♦ తఱుచుగల్గు
గాన ధనమును నీ భక్త♦గణము మదిని
కోరకుందురు గాబోలు ♦ కుజనహరణ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 49

సీ॥ హర్యక్షముల సమం♦బైన మహాకవుల్
శతకము ల్పరిపరి ♦ గతుల జేయ
నీవాక శతకమే ♦ నేర్పున రచియింతు
వనెద వేమో నాదు ♦ మనవి వినుము
కూరయొక్కటిదెచ్చి ♦ కుంభినిలో జనుల్
వారి నేర్పులచేత ♦ వండినపుడు
నానావిధంబుల ♦ గానుపింపవె రుచుల్
కావుననేజేయు ♦ కవితపిగావు
ఇంచుకంతయు జవిజూడు ♦ కొంచమనక
త్రాణభవముఖసనక కం♦దర్పజనక
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాణాబ్జాక్ష ♦ లలితవక్ష. 50

సీ॥ మూర్ఖునితో నెయ్య♦మునను బల్కుటకంటె
రసికుతో కలహంబు ♦ పొసగమేలు
జారయౌచక్కని ♦ దారగల్గుటకంటె
యతిగుణవతి కురూ♦పైన మేలు
గుణహీనసుతులు నూ♦ర్గురు జనించుటకంటె
నమితయశుం డొక్క♦డైన మేలు
పరధనంబును దిని ♦ బ్రిదుక జూచుటకంటె
తెగువతో వసనాభి ♦ తినుట మేలు
వసుధ సుగుణవిహీను వి♦ద్వాంసుకంటె
నినుభజించెడి బాలిశ ♦ జనుఁడు మేలు
నతజన సురక్ష ఘన కరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 51

సీ॥ కమల సన్నిధినున్న ♦ కప్పదామకరంద
పానసౌఖ్యంబేమి ♦ గాననేర్చు
నారికేళఫలంబు ♦ గోరితెచ్చినకోతి
దానిలో రసమెట్లు ♦ ద్రావనేర్చు
సంధునకును నిల్వు♦టద్దంబు దొరకిన
దనమోము సొగసెట్లు ♦ గనగనేర్చు
పాలపొదుగుల పిసుదు♦లంటబట్టుకయున్న
పాలధారలనెట్లు ♦ గ్రోలనేర్చు
నిశ్చయము హృదబ్జమందున ♦ నిలిచియున్న
గౌరినుత నిన్ను జడుడెట్లు ♦ గాననేర్చు
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 52

సీ॥ కోకిలతమదృష్టి ♦ గోచరంబైనంత
కాకులన్నియు కదుపు♦ గట్టివేగ
జట్టుగా గూయుచు ♦ చుట్టుముట్టడివేసి
పోవనీయక తన్ని ♦ బోయినట్లు
నీభక్తులనుజూచి ♦ నేర్పుసులను బోలి
కుమతులెల్లను గుంపు♦ గూడి కఠిన
వాక్కులచే పరిభ♦వము సేయనుజూతు
రట్టి పాపాత్ముల ♦ కంత్యమునను
యేమిగతిగల్గునో కాని ♦ యెఱుగరాదు
సర్వకర్మ ఫలాధ్యక్ష ♦ పాండుపక్ష
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 53

సీ॥ అంధునకిందూద • యంబొటయును చెవిటి
వానికి శంఖరా • వంబు మఱియు
మందునకును వధూ•సంగమాసక్తియు
పరమకృతఘ్నులౌ • బంధుజనులు
భస్మంబులో వేల్చు • బహుళహవ్యంబులు
పందికిపరిమళ • చందనంబు
లోభిమానవు నింటి•లోనున్న దర్వ్యంబు
మూకపఠించుసు • శ్లోకములును
స్వామిని గొల్వలేనట్టి • జన్మములును
నిష్ఫలంబులు ధాత్రిలో • నిశ్చయముగ
నతజన సురక్ష ఘన కరు•ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష 54

సీ॥ కఠినమౌ యురులసం•ఘము లేనిచో మెఱుకు
వానికిపక్షులు • వశములౌనె
వలలేకయున్నధీ • వరునిచేతను మీన
జాలంబు గైకొన • శక్యమౌనె
తగుబాణములులేక • నొగివేటకానిచే
యధికమౌ మృగములు • హతములౌనె
వారివిహీనమౌ • వరమావటీనిచే
పద్మసమూహంబు • పట్టుపడునె
నీచరణ నౌకలేకెంత • నిపుణులైన
సంసృతాబ్ధిని బడిదరి • జేరగలరె
నతజన సురక్ష ఘన కరు•ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష.

సీ॥ పంకోద్భవంబైన ♦ పద్మముల్ దేవతా
పూజకు శ్రేష్ఠమై ♦ పొసగలేదె
రాళ్ళలోబుట్టిన ♦ రత్నముల్ రాజుల
మండనంబులలోన ♦ నుండలేదె
ముండ్లచెట్టునబుట్టి ♦ మొగలిరేకులువిట
జనులకు మోదంబు - సేయలేదె
మృగజమౌకస్తూరి ♦ సొగసైన స్త్రీలకు
తిలకమై నుదుటను ♦ నిలువలేదె
హీనకులమునబుట్టిన ♦ మానవుండు
నినుభజించిన యత్యంత ♦ ఘనుడుగాడె
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 56

సీ॥ మేడిచెట్టునపూలు ♦ మేకకుత్తుకసన్న
చాలు తాపసులకు ♦ పాతకంబు
కర్షకునకుపెను ♦ కఱవు భాస్కరునకు
తిమిరంబువేముల ♦ తియ్యదనము
తెల్లనికాకులు ♦ దేవతలకుక్షుత్పి
పాసలు సంసార ♦ బద్ధుసుఖము
కాంతలనిజమునా ♦ కాశంబునకుదరి
మానికికలహంబు ♦ మన్మథునికు
వావిసీభక్తులకునెంత ♦ వరకునైన
జన్మమికలేదు పలుమారు ♦ చర్చసేయ
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 57

సీ॥ ఎంతవేడినను నా•సంతైన దయరాదు
పంతమా నామీద • పద్మనాభ
దిక్కు నీవని నేను • చక్కగా మొర్రిక్కన
నింకురావది యేమి • సుందరాంగ
పిలిచిన బలుకవు • చలమేల నామీద
యింతిగా హృదయార • విందతరణి
యన్యమెఱుగక నిన్ను • నాశ్రయించితి నన్ను
పోషించు మాధవ • భువనశయన
పరమ యోగీంద్రమందార • భవవిదూర
నిరుపమాకార క్షీరసా•గర విహార
నతజనసురక్ష ఘన కరు•ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 58

సీ॥ దేవతల్ ప్రార్థింప • తెగువతోను దధీచి
గాత్రమిచ్చియు కీర్తి • గాంచలేదె
వాయసంబుకబోత్రివ • వాంఛించి శిబిరాజు
కాయమిచ్చియుతృప్తి • సేయలేదె
యారంగిచెడిముంద • రన్నంబురంతిదే
వుడుబంచిపెట్టిపా • వనుడుగాడె
యాకలిచేడస్న • నట్టిబోయకుగువ్వ
కాయమిచ్చియుకీర్తి • గాంచలేదె
యిట్టిసామాన్యులేకోర్కు • లిచ్చుచుండ
నీవునన్నేలకుండుట • నిందగాదె
నతజన సురక్ష ఘన కరుణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష. 59

సీ॥ మకరిచేతనుజిక్కి ♦ మదిలోనస్మరించిన
మత్తేభనాథుని ♦ మనుపలేదె
వలువలుగోల్పోయి ♦ వైరులలో ద్రుపద
పుత్రి కృష్ణాయన ♦ బ్రోవలేదె
ద్రోణిబాణజ్వాల ♦ దాకికుక్షినిపరీ
క్షిత్తువేడినమర ♦ క్షింపలేదె
రావణుబాధకో ♦ ర్వక విభీషణుడునన్
బ్రోవుము రామాయన ♦ గావలేదె
గాన వివరరింపగామహా ♦ దీనజనుల
కరుణజూచుస్వభావంబు ♦ గలదునీకు
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 60

సీ॥ జననిందసేయుని ♦ సర్గంబుగలిగిన
క్రూరాత్ముడనుచు సం♦కోచమేమొ
యనృతవాక్యముపల్కి ♦ నట్టిదురాత్ముకుం
డనియు నాతోమాట ♦ లాడవేమొ
పాపకర్మముచేయు ♦ నాపరాధియటంచు
కాపాడుటకునీకు ♦ కష్టమేమొ
లేకపోయిననన్ను ♦ సాకకుండుటకేమి
కారణంబాశ్రిత ♦ పారిజాత
తన సుతునితప్పులెన్నక ♦ తండ్రిబ్రోచు
రీతి నన్నేలుమయ్య సం♦ప్రీతితోడ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 61

సీ॥ నీపుత్రుండిప్రవిమాకు ♦ నీభార్యశ్రీదేవి
కన్నతల్లియుమాకు ♦ సన్నుతాంగి
నీభక్తులేమాకు ♦ నిజముగాభాంధవుల్
నీసేవలేమాకు ♦ నిత్యపనులు
నీదయారసదృష్టి ♦ నిగిడించుకేమాకు
సష్టభోగంబులో ♦ శిష్టవినుత
నీమూర్తి కన్నుల ♦ నిగిడిజూచుటె మాకు
బ్రితిలేని ధనము శ్రీ♦పతి జితారి
నిన్ను మనమున ధ్యానించు ♦ చున్నదియె
యతియశంబైన చిత్తోప ♦ రతిసుఖంబు
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 62

సీ॥ పరుల యాచనచేసి ♦ బడలకుండను బ్రోవ
భారంబునీది శ్రీ♦పతి ముకుంద
తాపత్రియంబుల ♦ బాపి రక్షింపను
భారంబునీది శ్రీ♦పతి ముకుంద
యఖిల దుఃఖంబుల ♦ నణచి ప్రీతియొసంగ
భారంబునీది శ్రీ♦పతి ముకుంద
యనిశంబు మనసు నా♦యాజ్ఞలోపల నిల్ప
భారంబునీది శ్రీ♦పతి ముకుంద
యెన్నివిధముల జూచిన ♦ నన్నుబ్రోవ
నీదెభారంబు పరులది ♦ గాదు నిజము
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 63

వైరాగ్య త్రియోదశము

సీ॥ సంసారమును నమ్మి ♦ సంతసించెదనన్న
నాలుపిల్లలువెంట ♦ నంటిరారు
ధనము సంపాదించి ♦ ఘనుడ నౌదునటన్న
పూర్వాకృతము లేక ♦ పొందరాదు
తనువుజూచుక మోద♦మున నుండెదనటన్న
నఖిల రోగంబుల ♦ కాలయంబు
బ్రిదుకుటే నిజమని ♦ భ్రిమసియుండెదనన్న
నెప్పుడో యేక్షణ ♦ మెఱుగరాదు
యేది చూచిన లవమైన ♦ లేదు మోద
మనుచు నిన్నాశ్రియించితి ♦ ననవరతము
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 64

సీ॥ మలము మూత్రిము రక్త♦మాంసాస్థి పూరితం
బైన యీమేను హే♦యంబుదలప
నాకలి దప్పియు ♦ నధికామయములచే
శిధిలమౌటే కాని ♦ చేవలేదు
మృతినొంది నప్పుడీ ♦ మఱికి దేహము కుక్క
నక్కలపాలౌను ♦ చక్కగాను
ఎన్ని జన్మంబుల ♦ నెత్తినప్పటికిని
యిట్టి తనువులె కాని ♦ పట్టులేదు
గాన జన్మంబు లికనాకు ♦ గలుగకుండ
జేసి రక్షించుమౌని రా♦ట్చిత్తనిలయ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 65

సీ॥ కమలపత్రమునందు ♦ కదలుచుండెడినీర
లోదకంబులభంగి ♦ నుదధిమధ్యమునను
వచ్చెడిభంగ♦ములమాడ్కి భాస్కరు
నుదయాస్తమయముల ♦ నైఖరియును
సుప్తిజాగరముల ♦ చొప్పున గాలిచే
తిరుగుచుండెడివారి ♦ ధరముపగిది
జలబుద్బుదంబుల ♦ వలెను స్త్రీచిత్తంబు
రీతివిద్యుల్లేఖ ♦ భాతిననిరి
యస్థిరంబైన దేహంబు♦నందు మమత
లేక నిన్నుభజించుటే ♦ శ్రీకరంబు
నతజన సురక్ష ఘన కరుణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 66

సీ॥ అసహాయమున శూరు♦డై శత్రునికరంబు
గెలిచినవార్ధిలం♦ఘించినాను
బహుళమంత్రంబులు ♦ పఠనసేయుచున్న
గరము హోలికన్య ♦ గలిగియున్న
రసవాదములు పెక్కు ♦ విహనక నేర్చిన
నఖిలవిద్యలదక్షు♦డైనగాని
యోగసిద్ధులుగల్గి ♦ యుగయుగంబుననున్న
పూనిదైవములు స్వా♦ధీనమైన
నాసటవాసినవారికి ♦ కొసరులేదు
గాన నినునమ్మితే ముందు ♦ గల్గుసుఖము
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 67

సీ॥ ఎంతదాకనుధనం ♦ బెడతెగకనుదెచ్చు
నంతవట్టును గేహ ♦ మందునున్న
భార్యాపుత్రులు ♦ సకలబంధువుల్ క్షేమప్ర
సంగముల్ చేసి యు ♦ ప్పొంగుచుంద్రు
దైవకారుణ్యంబు ♦ దప్పి రోగాదుల
వలన దేహముపట్టు ♦ వదలియున్న
నొక్కరైనవచ్చి ♦ వెరవకంచొకమాటు
పలుకరించరులోక ♦ పద్ధతిదియు
గనుక దుర్వ్యసనంబుల ♦ గడకుద్రోలి
భక్తితో నన్ను వేడిన ♦ ముక్తిగలుగు
నతజన సురక్ష ఘన కరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 68

సీ॥ తనువున బ్రాణముల్ ♦ తరల కెన్నాళ్లుండు
నన్నాళ్లు తలిదండ్రు ♦ లఖిలజనులు
పరిపరివిధముల ♦ భాషింపుచుందురు
కాలవశమున ప్రాణి ♦ కడకుద్రోల్ల
నధికమోహమున నా ♦ శ్రయించిన భార్య
శవము జూచి యంత ♦ జెందుభీతి
యిదిగాక కష్టవేగ ♦ నింధనంబులుదెచ్చి
దహనంబుచేతురీ ♦ ధర్మమేమొ
యిట్టి దేహమునందాన ♦ గట్టిపెట్టి
నిను భజించిన గల్గును ♦ నిత్యతృప్తి
నతజన సురక్ష ఘన కరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 69

సీ॥ నారీకుచంబులు ♦ నాభిప్రదేశ సుం
దరముజూచిన మోహ ♦ శరధిలోన
మునిగియుండెలుగక ♦ మోసపోవుచునుంద్రు
పరికించిజూడనా ♦ పడతిసొగసు
మాంసరక్తముక్రొవ్వు ♦ మయమైనదే కాని
మంచివస్తువుకొంచ మైనలేదు
పలుమారుయీరీతి ♦ భావించిచూచిన
భ్రాంతినశించి శ్రీ♦కాంతనిన్ను
మరువకుండస్మరించెడి ♦ మమతగుదురు
చారుగుణసాంద్ర భక్త చ♦కోరచంద్ర
నతజన సురక్షణకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 70

సీ॥ బాలత్వమునతోడి ♦ బాలురతో మంచి
యాటలాడుటకునై ♦ యాశగల్గు
వయసుకాలమున భా♦వజు పీడచే నవ
కాంతలపై ప్రేమ♦గలిగియుండు
వృద్ధాప్యమున మహా ♦ వృజినహేతుకమైన
చింతచేతను మిగుల ♦ శిథిలమాను
మూడవస్థలచేత ♦ మునుగుచుండురె కాని
స్థిరచిత్తముననీదు ♦ స్మరణనిమిష
మాత్రమైనను జేయరీ ♦ ధాత్రిజనులు
చిన్మయాకార యిందిరా ♦ చిత్తచోర
నతజనసురక్షణ కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 71

సీ॥ సాధుసాంగత్యంబు ♦ సంభవింపనుగల్గు
నిస్సంగభావంబు ♦ నిశ్చయముగ ని
స్సంగమున వేగ ♦ నిర్మోహముదయించు
నిర్మోహమునగల్గు ♦ నిశ్చలాత్మ
నిశ్చలాత్మధ్యాన ♦ నిష్ఠజేగల్గును
యతుల జీవన్ముక్తి ♦ మతిదలంప
గావున సాధుసాంగత్యమజస్రంబు
గలుగజేయుమునాకు ♦ కమలనాథ
సన్నుతాఖిల వేదవి♦స్తారమోద
సురమునీంద్రార్చితపాద ♦ సుప్రసాద
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 72

సీ॥ కామాది శత్రువ♦ర్గము గెల్వలేనట్టి
పాపాత్ముడను నేను ♦ పరమపురుష
కలనైన నీపాద♦కమలంబులను జూపి
భయముదీర్పవదేమి ♦ భక్తవరద
దుర్జనుండనినన్ను ♦ దూరంబుజేసిన
శరణాగతత్రాణ ♦ బిరుదుపోదె
పరమ కృపాబ్ధినీ ♦ పాలబడితినన్ను
నేతీరునైనను ♦ నేలుకొనుము
తప్పులెన్నక గరుణించు ♦ దండమిదిగో
వాసుదేవ హృషీకేశ♦ త్రాసహరణ
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 73

సీ॥ పామరుండనినన్ను ♦ బండితుల్ నిందింప
పలుమారు మొఱబెట్టి ♦ బడలనేల
యింద్రియంబులను జ♦యించి మానసమున
నినుభజించెడివాని ♦ జనులకైన
గనుపింపవని బుధుల్ ♦ గణుతింపుచుందురు
ఖలుడ మూఢుడ నన్ను ♦ గనుటయెట్లు
లతిదీనుడనినీకు ♦ నాతిగక్కఱవలెగాని
నేజేయునదియేమి ♦ నిర్మలాత్మ
మైన నీదయ నాపాప్రాప్తి ♦ యరసిచూడ
నెట్టులైనను మంచినీ ♦ పట్టువిడువ
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 74

సీ॥ కావ్యనాటకయులం ♦ కారవ్యాకరణాది
శాస్త్రముల్లవమైన ♦ చదువలేదు
లక్ష్యార్థవాచ్యార్థ ♦ లక్షణంబెరుగను
జర్చించిచూడగా ♦ శబ్దరూప
భేదజ్ఞానంబేక ♦ పాదమైనను లేదు
పండితులను గూడి♦యుండలేదు
భవదనుగ్రహమున ♦ బల్కితి నీకీతి
తప్పులుండినభక్తి ♦ తక్కువగునె
యిక్షుదండంబునకు వంక ♦ లెన్నియున్న
తియ్యనేకాని పరికింప ♦ తిక్తమగునె
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 75

సీ॥ పరమభక్తులపాద ♦ పాంసుమదీయమ
స్తకముననే పొర్లిద్దు ♦ దాల్తుగాని
ధనమదంబున సాధు ♦ జనులనునిందించు
పాపులిండ్లకునెంత ♦ పనికినైన
పోనొల్లనిదియెనా ♦ బుద్ధినిశ్చయమని
విన్నవించితినీకు ♦ సన్నుతాంగ
గావుననాదుసం ♦ కల్పమీడేర్చు మీ
పరమయోగీంద్రహృ ♦ త్పద్మమధుప
జితసుజనత్రాస పీతకౌ ♦ శేయవాస
మండనవికాస ముఖపద్మ ♦ మందహాస
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 76

వేదాంత పంచవింశతి

సీ॥ పంచభూతముల త♦ప్పక నొక్కొకటి రెండు
పాళ్లుజేసియు మొదటి ♦ పాలువిడచి
కడమరెండవపాలు ♦ క్రమమున నాల్గేసి
భాగముల్ జేసియూ ♦ భాగములను
సమముగానైదు భూ♦తములలోగల్పియు
పంచవింశతిగనే ♦ ర్పరచిబుధులు
షడ్వింశకుండన ♦ సప్తవింశకుండన
యీశపరమాత్ములై ♦ యెన్నబడిన
నిన్ను ధ్యానింపుచుందురు ♦ నిశ్చయముగ
నవ్యయానందపరిపూర్ణ ♦ భవ్యచరిత
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 77

సీ॥ గర్భస్థుడగువహ్ని ♦ గానుకొందరు నిన్ను
భావింపుచుందురు ♦ భక్తితోను
మఱియుకొందఱుహృ త్క ♦ మలమధ్యమందున
రుచిరదేహాకాశ ♦ రూపిగాను
ధ్యానింపుచుందురు ♦ మానుగాపలుమారు
పరిపూర్ణజ్ఞాన సం♦పన్నులైన
మునులుకొందఱుమోద ♦ మునవాసికాగ్రమం
దునపరంజ్యోతిగా ♦ ననుదినంబు
చింతజేయుచునుందు ర♦నంతరూప
విపరిమిత సూర్యచంద్ర మ ♦ ధ్యప్రదీప
నతజనసురక్ష ఘున కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 78

సీ॥ అవనిక్షీరములయం ♦ దాజ్యమున్నట్లుగా
నువ్వులలోనున్న ♦ నూనెవగిది
దారువులందున్న ♦ దహనంబువిధమున
జలకులో గుడమున్న ♦ కరణిగరుడ
సురనరయక్షకి ♦ న్నరసిద్ధగంధర్వ
దానవపశుమృగ ♦ దంశమాది
గాసర్వభూత హృ♦త్కమల మధ్యంబున
నివసించిబాలిశ ♦ నికరమునకు
పొందశక్యంబుగాక స♦త్పురుషులకును
వేద్యమైయున్న భవరోగ ♦ వైద్యశౌరి
నతజన సురక్ష ఘున కరు♦ణాకటాక్ష.
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష 79

సీ॥ చరణమూలములచే ♦ చరమరంధ్రములను
మూసి ప్రాణాపాన ♦ ములునుగలిపి
ప్రాగ్దక్షిణోదీచి ♦ ద్వారముల్ బంధించి
సకలనాడుల జను♦శ్వాసనములను
ప్రాణంబులనుజేర్చి ♦ ప్రాణవాయువు బ్రహ్మ
నాడిమార్గంబున ♦ నడచునటుల
హఠము జేసియు సుషు♦మ్నాగ్రమందున కోటి
రవితేజమునుదీటు ♦ రాక స్వప్ర
కాశమునయున్న నిన్నును♦గలసి యోగి
వరులు జన్మములెత్తరీ ♦ వసుధ నభవ
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష. ♦ లలితవక్ష. 80

సీ॥ నీవు నేనను భేద ♦ భావమించుకయైన
లేక సమస్త క♦ళేబరముల
బరమాత్ముడొక్కడే♦ భాసిల్లుచున్నాడు
యితరంబులేదని ♦ ప్రతిదినంబు
తన్ను తాజూచుచు ♦ తానె యశేషభూ
తములటంచును యథా♦ర్థముగ దెలిసి
నిన్ను సేవింపుచు ♦ నీవె తానను కొంచు
నిరుపమానందాంబు♦నిధిమునింగి
యున్నవారల జన్మమీ♦యుర్విలోన
జన్మమేగాక యితరుల ♦ జన్మమేల
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 81

సీ॥ అయనద్వయంబేక ♦ హాయనంబదియును
దేవతలకు నొక్క ♦ దివసమగును
తద్దివసములద్వాద♦శ సహస్రాబ్దముల్
జనినయుగములునాల్గు ♦ జనుననవియు
దగజతుష్కము మహా ♦ యుగమవి డెబ్బది
యొకటి మన్వంతరం ♦ బొనరనవియు
బదునాల్గువిధికొక్క ♦ పగలగునివిశతి
వత్సరంబులు బ్రహ్మ ♦ ప్రళయమగును
యిట్టి ప్రళయంబు లెన్నైన ♦ యేకమూర్తి
తగుటనే సత్స్వరూపుడ ♦ వాదిదేవ
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 82

సీ॥ ఇది వస్త్ర మిది ఛత్రి ♦ మిది మఠంబిది ఘటం
బిదియు శయ్యయుగాత్రి ♦ మిదియటంచు
ఇదివనం బిదిఘనం ♦ బిదిశైల మిదిశైల
మితేజు ప్రభాకరుం ♦ డివిగ్రహములు
ఇదిస్వాంత మిదిశాంత ♦ మిదిజ్ఞాన మిదిమాన
మిదియు శేముషిచిత్త ♦ మిదియటంచు
బాహ్యాంతర పదార్థ ♦ భాసముల్వేర్వేఱ
సాధనంబును పేక ♦ సాక్షివగుచు
నీవెఱుంగుదు గావున ♦ నిత్యవిమల
చిత్స్వరూపుడవీవు ని♦శ్రియనాథ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 83

సీ॥ వాయువశంబుచే ♦ వారిదంబులు మింట
బరుగుచుండగా ♦ బాలకులను
జందు్రు రికెనటంచు ♦ జాటి చెప్పినరీతి
నఖిలభూతాత్ముడ ♦ వైననీకు
నంతఃకరణనిష్ఠ ♦ మైన దుఃఖములును
గలవని మూర్ఖులు ♦ గండ్రుగాని
సుఖము స్వాభావమై ♦ సుస్థిరంబుగనుండు
గనుతింప దుఃఖమా ♦ గంతుకంబు
గావునను నిత్యనిరుపాధి ♦ కంబునైన
సముధనానందమయుడవు ♦ స్వామినీవు
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 84

సీ॥ తత్త్వమసియనువాక్య ♦ తాత్పర్యమెఱిగిన
బట్టబయలై యాత్మ ♦ గుట్టుదెలియు
గుట్టుదెలిసినయపుడె ♦ గుణమయంబైనట్టి
సంసారమెల్ల తు ♦ చ్ఛముగ దోచు
దోచినప్పుడె ♦ యాత్మతో గతిగల్గును
గల్గినంతనె నీవు ♦ గరుణతోడ
నానావిధంబుల ♦ బూనిరక్షింతువు
గాన నీ దయలేని ♦ కష్టరతుల
వృత్తిజూడ విచిత్రమై ♦ యుండువారి
కర్మమో లేక నీమాయొ ♦ కానరాదు
నతజనసురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 85

సీ॥ అనిశంబు సర్వభూ ♦ తాంతరంగములందు
వర్తించునిన్ను న ♦ వజ్ఞ చేసి
మనుజులు తామ్రమృ ♦ ణ్మయమైన ప్రతిమల
పూజసేయుచుమంచి ♦ బుద్ధిలేక
బహుమూఢులై యుచిత ♦ భక్తి చేతనునిన్ను
ధ్యానింపలేని యా ♦ మానవులును
బూడిదలో నెయ్యి ♦ బోసినవిధమున
నిష్ఫలప్రాప్తులై ♦ నిలచియుందురి
గనుక నీస్వరూపము ♦ గదియజేసి
నిశ్చలంబుగ మనసును ♦ నిలుపవలయు
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 86

సీ॥ భువిచతుర్విధము తా ♦ భూతజాలములోన
శాస్త్రచింతనజేయ - జాలినట్టి
మనుజజన్మము లెస్స ♦ మంచిది యిందులో
కరము స్వాతంత్ర్యంబు ♦ గలిగియున్న
పురుషజన్మముశుభ ♦ కరముగావున యిట్టి
జన్మమందే ముక్తి ♦ జెందవలయు
గర్వాంధులై ముందు ♦ గానకదినములు
వ్యయముజేసినయంత ♦ వరకునైన
పురుషజన్మంబుదొరకుట ♦ దుర్లభముజూడ
రజతగిరిపతి తోష ప్ర♦ రాణపురుష
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 87

సీ॥ అరయగా వాఙ్మన ♦ సాతీతమగు నిన్ను
ధ్యానించుటెట్లు పు♦రాణపురుష
యఖిల జగత్పూర్ణ♦మైయున్న నీకును
చెలగి యావాహన ♦ సేయుటెట్లు
లవని వ్యోమాదుల ♦ కాధారమగు నీకు
విహితాసనంబు గా♦వించుటెట్లు
సహజమై స్వచ్ఛమై ♦ సమతనుండెడి నీకు
నర్ఘ్యపాద్యముల స♦మర్పణెట్లు
తలపనిత్యము పరిశుద్ధ ♦ తనువునైన
యెంచి నీ కాచమనము న♦ర్పించుటెట్లు
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 88

సీ॥ అత్యంత నిర్మలం♦బై యున్న నీకును
స్నానంబు జేయించు ♦ సంజ్ఞయెట్లు
విశ్వాధికుడవునై ♦ వెలయుచుండెడి నీకు
వస్త్రధారణచేయు ♦ వసతియెట్లు
మొనసిన కులగోత్ర ♦ ములులేని నీకును
యజ్ఞోపవీతము ♦ లిచ్చుటెట్లు

* * *

లపరిమేయంబునైన ప♦రాత్మనీకు
చేరి పుష్పములను పూజ ♦ సేయుటెట్లు
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 89

సీ॥ అనఘు నిరంజనుఁ ♦ డై యొప్పుచున్నట్టి
నీకు ధూపం బెట్లు ♦ నిర్వికార
శతకోటి రవికాంతి ♦ సరిరాని నీకును
దీప మొసఁగుట యెట్లు ♦ దేవదేవ
నిత్యతృప్తుఁడవైన ♦ నీకు నైవేద్యంబు
లర్పించు టెట్లు స♦ర్వాంతరాత్మ
యనవరతానంద ♦ మునఁ జొక్కు నీకును
విడె మొసంగుట యెట్లు ♦ విశ్వనాథ
ఆదిమధ్యాంత శూన్యమై♦నట్టి నీకు
బొసఁగఁగను మంత్రపుష్పంబు ♦ నొసఁగు టెట్లు
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 90

సీ॥ సతతంబు స్వప్రకా♦శమున నుండెడి నీకు
బొసఁగ నీరాజన ♦ మొసఁగు టెట్లు
లాశాష్టకము పూర్ణ♦మైన నీకు ప్రదక్షి
ణము జేయు టెట్లు స♦నాతనాత్మ
యద్వితీయుఁడవునై ♦ యలరుచుండెడి నీకు
దండ మర్పించెటి ♦ ధన్యు లెవరు
ఆమ్నాయములకెల్ల ♦ నలవిగాకున్నట్టి
నినుఁ నుతించుట యెట్లు ♦ జననరహిత
గురుముఖంబున నీరూపు♦ గురుతెఱుంగ
లేక యీపాట్లు పడనాయె♦ లోకులెల్ల
నతజన సురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 91

సీ॥ నిర్భరశాంతుఁడై ♦ నిశ్చింతనుండుటే
యెంచి నీమూర్తి ధ్యా♦నించుక్రమము
లరయఁగా నిష్క్రియు♦ఁడై యుండుటే నిన్ను
బలుమాఱు పూజించు ♦ పద్ధతియును
అలఘు సోహంభావ ♦ మందునిల్చుటె నీకు
దండమర్పించు వి♦ధమ్ముసుమ్ము
యింద్రియ మనముల ♦ నిటునటు బోనీక
యానందమున నోల♦లాడుటరయ
నవరతమును నినుఁగూర్చి ♦ ఘనముగాను
సకల రాజోపచారముల్ ♦ సలిపినట్లు
నతజన సురక్ష ఘనకరు ♦ ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 92

సీ॥ అత్యంతమలినదే ♦ హమునకోస్నానంబు
భావింపనిర్మల ♦ జీవమునకొ
యస్థిరంబగుసావ ♦ యవమోధ్యానించుట
నిత్యశూన్యంబైన ♦ నిరవయవమొ
యరయనిష్క్రియుఁడైన ♦ పురుషుఁడోకారకుఁ
డోనరనచేతన ♦ తనువోచూడ
సాత్త్వికంబునవీని ♦ సరణియథార్థంబు
గానెఱింగినభక్త ♦ గణమునకును
సదయ నీదగు సాయుజ్య ♦ పదవినొంద
సులభమగు నిశ్చయంబిది ♦ సుప్రకాశ
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 9

సీ॥ అజుడవవ్యయుడవీ ♦ వాద్యంతశూన్యుడ
వప్రమేయుడవు స♦ర్వాంతరాత్మ
యక్షరుండవు సచ్చి♦దానందమయుడవు
నిర్గుణుండవు సదా ♦ నిర్వికార
సర్వసాక్షివిసర్వ ♦ సంగవర్జితుడవు
నిరుపమానుడవీవు ♦ నిర్వికల్ప
యరయబరంజ్యోతి ♦ వై బ్రకాశించునీ
స్వస్వరూపధ్యాన ♦ సద్వ్రతంబు
ననిశమును విడువకుండనా ♦ మనసునకును
నాజ్ఞదయసేయు సంతత ♦ ప్రాజ్ఞవినుత
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 94

సీ॥ జన్మపరిపాకనా ♦ శనము ఫలమునకు గ
ల్గినవృక్షమునకు ♦ గల్గనటుల
భూరిమద్భావవి ♦ కారము లే దేహము
నకుఁగాని జీవ వ♦ర్న మునను న్న
నీకు నాశము లేదు ♦ నిత్యనిర్మలుడవు
నిరుపాధికుండవు ♦ నిఖిలలోక
కారణుండవు స్వప్ర ♦ కాశుండవఖిలేంద్ర
యాతీతుడవు పర ♦ మాత్ముడవును
నిర్గుణుండవునైనట్టి ♦ నినుభజింతు
సంతతంబాత్మమయుత సా♦క్షాత్కరింపు
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 95

సీ॥ నీరజోగుణముచే ♦ నిఖిలజీవములను
గల్పించుచుందువు ♦ కమలనాథ
నీసత్త్వగుణముచే ♦ నిఖిలజంతువులను
పోషించుచుందువు ♦ పురుషవర్య
నీతమోగుణముచే ♦ నిఖిలచేతనముల
హతము జేయుచునుందు ♦ వార్యవినుత
హరిహరపంకేరు ♦ హాసననామముల్
గలిగి వర్తింతువు ♦ కనకచేల
చారుమాయావినోదివై ♦ సంతతంబు
చిత్రములు సేయుచుందు వీ♦ధాత్రిలోన
నతజనసురక్ష ఘన కరు♦ణాకటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 96

సీ॥ సర్వధర్మంబుల ♦ సన్యసించుచు నెవ్వ
డైన నిన్నొక్కని ♦ నాశ్రయించి
స్థిరచిత్తుడగువాని ♦ దురితంబులన్నియు
బోదోలి రక్షింతు ♦ భూమిలోన
నని ప్రతిజ్ఞయు జేసి ♦ యర్జును దుఃఖంబు
బాపితి వదిగాన ♦ భక్తవరద
నీవె నాగతివంచు ♦ నిన్నె నమ్మికయుంటి
నన్ను పోషించు మ♦నాథనాథ
యద్వితీయ ముకుంద ప♦రాత్మ నిర్వి
కార సురవంద్య విష్ట ప♦ధార శౌరి
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 97

సీ॥ గురుపాదతీర్థంబు ♦ గోరికగల్గునే
ప్రవిమలవైరాగ్య ♦ భాగ్యమహిమ
గురుసుప్రసాదంబు ♦ గొనకున్న గల్గునె
నీమూర్తిధ్యానించు ♦ నిష్ఠ మదికి
గురుపూజలేక చే ♦ కూరునే నిజముగా
నీస్వరూపజ్ఞాన ♦ నిశ్చయంబు
గురువె దైవంబను ♦ గురిలేకగల్గునే
నిరతిశయంబైన ♦ నీ పదంబు
గాన సద్గురువుల గొల్చు ♦ ఘనులకెపుడు
మోక్షమఱచేతిలోనుండు ♦ ముఖ్యముగను
నతజన సురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 98

సీ॥ హరుని పార్వతిని బ్ర♦హ్లాదుని నారద
మౌనిని ధ్రువుని సా ♦ మజవరేణ్యు
ఘంటాసురుని బలిని ♦ గాంగేయు నిన్నరుని
విదురుని గుహుని ద్రౌ♦పదిని శుకుని
శ్వసనపుత్రుని విభీ♦షణుని పరాశర
సుతుని రుక్మాంగద ♦ క్షోణివిభుని
నంబరీషనృపాలు ♦ నక్రూరు శౌనకు
నాదియౌభాగవ ♦ తాఖ్యులైన
వారి నిరతము నుతిజేయు ♦ వారుగంద్రు
నిన్ను మనములనేపొద్దు ♦ నిశ్చయముగ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 99

సీ॥ జన్మపావనముకై ♦ స్మరణసరణి నీస
పద్యముల్ రచియించి ♦ భక్తితోడ
నీకుసమర్పించి ♦ యేకలంకము లేక
కరము నామనసు వా♦క్కాయములను
జేయుతప్పు ల క్షమ ♦ సేయుమంచును నీకు
దండమర్పించితి ♦ కుండలీంద్ర
శయన జనార్దన ♦ జలధర నిభ దేహ
వాసుదేవ ముకుంద ♦ వనజనాభ
సకల పాపములనుబాపి ♦ సంతసమున
మోక్ష మొసగియు రక్షించు ♦ దీక్షతోడ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 100

సీ॥ మద్బాల్యమునను శ్రీ♦మద్భాగవతస్మృతి
గలుగ జేసిన దయా ♦ కరుడవీవె
బహువిధమంత్రార్థ ♦ భావముల్ దెలిపిన
ధరను వేంకటరామ ♦ గురుడవీవె
యమనియమాది యో♦గముల బోధించిన
వెంకయనామకో ♦ విదుడవీవె
ప్రీతిలేనివిజ్ఞాన ♦ పథమున చిత్తంబు
నిలిపి మన్నించిన ♦ నేతవీవె
నీవె సచరాచరంబులు ♦ నీవుగాని
వస్తువెక్కడనున్నది ♦ వసుధలోన
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష. 101

సీ॥ శాలివాహనశక • సంవత్సరంబులు
ఋతునభదిగ్గజ • రూపసంఖ్య
జనుచుండగా దట • స్థంబైన తారణ
వర్షమందున మార్గశీర్ష శుద్ధ
తదియలవరకు సం•దడి నాగదానుచే
నతిగ నష్టోత్తర • శతమునీస
పద్యముల్ రచియింప • బడెను నారాయణ
స్వామికర్పణగ నీ • శతకమెవరు
చదివినను వ్రాసినను విన్న • సకలభోగ
కామ ధర్మార్థమోక్షముల్ • గలుగుభువిని
నతజన సురక్ష ఘన కరు•ణా కటాక్ష
లక్ష్మీనారాయణాబ్జాక్ష • లలితవక్ష! 102

లక్ష్మీనారాయణశతకము

సంపూర్ణము.

